కరుణామయుడగు బాబా
కనిపించె మసీదు లోన
హిందూముస్లిము భక్తుల
కిట్లని భోధించినాడు

ఏ పేరున పిలిచిననూ
ఏ తీరున పూజించిన
కలడు దేవుడొకడేయని
తలచరెంత టజ్ఞానులు.

అన్నదమ్ము లెందరైన
కన్నతల్లి ఒకటె కదా
భిన్న భిన్న శాఖలున్న
వృక్షమైతె ఒకటెకదా!

వేరు వేరు నదులైనను
చేరబోవు జలధి యొకటె
జాతిమతాల్ వేరైనా
సర్వులకొకడే దేవుడు

అన్నిభూతముల యందున
ఉన్న దేవుడొకడే ఏ
జీవిని హింసించిన ఆ
దేవుని హించినట్లు

అనితలచక పరస్పరము
అయ్యో కలహింతురేల?
అన్నదమ్ములట్లు కలసి
అన్యోన్యతమెలగరేల?

మృదు మధురము గా బాబా
హిందువులకు ముస్లిములకు
సమహిత మతసామరస్య
సారాంశము బోధించెను.

॥శ్రీ శిరిడీ సాయి చరిత॥

## బాబా చికిత్సా పద్ధతి

### వైద్యో నారాయణోహరి

బాబ చికిత్సా పద్ధతి
బహు చిత్రముగా నుండును
భగవంతుని లీలలన్ని
బహు విచిత్రముగ నుండును

మీ భారము లన్నియు నా
మీద నుంచుడని నేమో
సెదనని చెప్పిన బాబా
చిత్రలీల లమోఘములు

ఆర్ధగుణాకరుడు బాబ
ఆశ్రిత జన మందారుడు
ఆ పన్నుల నార్ధతతో
నాదు కొనెడిదయామయుడు

పాముకాటు, కుష్టు, ప్లేగు
పరమ కఠిన రోగములను
చిటికెడంత ఊదునిచ్చి
చిటికెలోన బాగుసేయు

ధునిలోని విభూది ఆశ్రి
తులకునిచ్చి పంపుచుండు

అదేసాయి దివ్యౌషధ
మాశ్రితాళి బ్రోచుచుండు

ఇదియె సర్వరోగహరము
ఇదియె సర్వదుఃఖహరము
ఇదియె సర్వ రక్షాకర
మిదియే దివ్యౌషధమ్ము

ఆవో! కల్యాణరామ! ఆవో ఆవో!
లావో ఊదీకె థెలై లావో లావో!
రారా కల్యాణ రామ! రారా రారా!
తేరా ఊదీగోనెల తేరా తేరా!

॥శ్రీ శిరిడి సాయి చరిత॥

## బాలాజీ (బాలగణపతి షిండె) భక్తునకు మలేరియా జబ్బు

బాలాజీ అను భక్తుడు
మలేరియా జబ్బున పడి
ఎన్ని మందులను వాడిన
ఏ మాత్రమ్ము నయముకాక
సాయి శరణు వేడు కొనగ
సాయి ఇట్లు శలవిచ్చెను

లక్ష్మీ మందిరమున న
ల్లని కుక్కకు పెరుగన్నము
తినిపించుము జబ్బు కుదురు
నని చెప్పెను అతడట్లే
గావించెను జబ్బు కొలది
కాలమునకె నయమాయెను

బాబ చికిత్సా పద్ధతి
బహు చిత్రముగా నుండును
బాబ శరణు గోరిన త
ప్పక రోగి నిరోగియగును

## దాదా సాహెబ్ కపర్డె కొడుకుకు ప్లేగు జబ్బు

దాదా సాహెబు కపర్డె
ధర్మపత్నితో సుతుతో
సాయీ సన్నిధిని గడుపు
సమయంబున అతని సుతుడు
ప్లేగు జబ్బుతో మిక్కిలి
పీడితుడై చిక్కిపోయె

కన్న తల్లి వాని బాధ
కనలేకను తల్లడిల్లి
బాబా నాకొడుకును కా
పాడు మనుచు వేడుకొనెను

కనికరించి బాబా తన
కఫనీ పై కెత్తి చూడు
మని చంకను ప్లేగు పొక్కు
లను చూపుచు నా బిడ్డల

బాధల స్వయముగ నేనే
భరియింతును భయములేదు
అని పలికెను సాయిబాబ
ఆ జబ్బది నయమాయెను

మీ భారము లన్నియు నా
మీద నుంచుడని నే మో
సెదనని చెప్పిన బాబా
చిత్ర లీల లమోఘములు
॥శ్రీ శిరిడి సాయి చరిత॥

## శ్యామా మూలవ్యాధి నివారణ

శ్యామా ఒకసారి మూల
వ్యాధి చేత బాధపడుచు
మొరపెట్టు కొనంగ సునా
ముఖి కషాయమును త్రాగు మ
టంచు బాబ చెప్పె నతడు
ఆ కషాయమును ద్రాగెను

అంతరోగ ముపశమించె
అయిన కొంత కాలానికి
జబ్బు తిరిగి వచ్చెనతడు
సాయి నడుగ కుండగనే
స్వంతముగా సునాముఖి క
షాయము చేసుక త్రాగెను

జబ్బు తగ్గుటకు బదులుగ
ముబ్బడించగా నాతడు
సాయి విభుని వేడుకొనెను
జబ్బు తగ్గి నయమాయెను

బాబ చికిత్సా పద్ధతి
బహు చిత్రముగా నుండును
భగవంతుని లీలలన్ని
బహు విచిత్రముగ నుండును.
॥శ్రీ శిరిడి సాయి చరిత॥

## మట్టి తిలకంతో ప్లేగు జబ్బు మాయం

ప్లేగు జబ్బు కొరిగి పోవు
బిడ్డను రక్షించు కొనగ
ఆర్తుడొకడు చందోర్కరు
నడిగెను ఊదీనిమ్మని

ఊదీ తన ఇంటను లే
కుండుటచే చందోర్కరు
సాయిని మదిలో స్మరించి
సబ్‌కా మాలిక్ సాయీ
అని మట్టిని గైకొని ఇ
ల్లాలినుదుట నుంచినాడు

ఊది నడుగ వచ్చిన అత
డూరు తిరిగి వెళ్లి చూడ
తన కూతురు ప్లేగు జబ్బు
తగ్గిపోయి బాగుండెను

బాబ చికిత్సా పద్ధతి
బహు చిత్రముగా నుండును
భగవంతుని లీలలన్ని
పరమాద్భుతముగ నుండును
॥శ్రీ శిరిడి సాయి చరిత॥

## రాచ కురుపు మాన్పుట

మాలేగామ్ అను ఊరున
మహావైద్యు డొక్కడు తన
మేనల్లుని రాచకురుపు
మాన్పలేక విఫలుడాయె

శిర్డి పుణ్యక్షేత్రము ద
ర్శించు వారి కవశ్యముగ
వైద్యానికి లొంగనట్టి
వ్యాధులు నయమైపోవును

అనుచు పలువు రాడు మాట
లనువిని ఆరోగిని గొని
వాని తల్లిదండ్రులు శి
ర్డీని జేరి ప్రార్థించిరి

బాబా నీవే మాదగు
బాబును రక్షించవలయు
అని మిక్కిలి దైన్యముతో
అర్థించిరి సాయి విభుని

జాలిని గొని బాబా ఆ
బాలరోగి రాచకురుపు
పైనొకింత ఊదిరాచి
బాధనుపశమింపజేసె

కొలది దినమ్ములలోనే
కురుపు ఊది రాయుటచే
పూర్తిగ నయమై వానికి
పూర్ణా రోగ్యము గలిగెను

ఈ వింతను విన్నంతనె
ఆ వైద్యుడు శిర్డీచని
బాబను దర్శించ నెంచి
వచ్చుచుండ దారినడుమ

వ్యతిరేక వదంతులు విని
బాబను దర్శించ కుండ
ఆగిపోయి గడుపుచుండ
అతనికిట్లు కలవచ్చెను

ఇంకను నను నమ్మకుండ
శంకించుచు నున్నావా!
అనుచు పదే పదే మూడు
దినములిట్లు వినవచ్చెను

అపుడా వైద్యుడు శిరిడీ
అరుదెంచగ నుత్సహించె
కాని ఒకడు విషజ్వరము
తోన బాధపడుచుండుట

ఆ రోగి చికిత్స లోన
ఆగిపోయె అతడచ్చట

ఎన్ని మందులిచ్చిన ఒ
క్కింత జ్వరము తగ్గదాయె
రోగిని విడి వెడల లేక
ఆగిపోయె ఆ వైద్యుడు

బాబానే పరీక్షించు
భావములో నిట్లనుకొనె
రేపటికీ రోగికి నయ
మై పోయినచో శిరిడీ
కేగెదనని యెడద నిశ్చ
యించు కొనిన వాడాయెను

మరునాడా రోగిని గన
అరుదెంచెను భిషగ్వరుడు
రోగిలేచి తిరుగాడుచు
రూఢి నిరోగిగ నుండెను

అదిగని విస్మయ చకితుం
డై వైద్యుడు వెనువెంటనె
బయల్వెడలె శిరిడికి బా
బాను భక్తి దర్శించగ

బాబా చరణాల మీద
పడిపోయెను భిష్యగ్వరుడు
అనుభవైక వైద్యమునను
అతని కనులు తెరుచుకొనెను

నాటినుండి అతడు సాయి
నాథుని సేవించుకొనుచు
వృద్ధి నొందుచును అభీష్ట
సిద్ధిని గని తరియించెను

శ్రీ శిరిడి సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

॥శ్రీ శిరిడి సాయి చరిత॥

## బాబా గోధుమలు విసరుట కలరాను పారద్రోలుట

ఒక రోజుదయాన బాబ
ముఖక్షాళనము చేసుక
గోనెసంచి పరిచి దాని
పైన నిసుర్రాయి నుంచి

కోయ్యగుంజ బిగియగొట్టి
గోధుమలను విసరుచుండె

ఆ దృశ్యము జూచి కొంద
రాడవారు చకితులైరి
అందున నల్వురు మహిళలు
ముందున కరుదెంచినారు

చనువున బాబాను వారు
జరిపిరి ప్రక్కకు గుంజను
బట్టుక బాబా పాటలు
పాడుచు ఇసురగ దొడగిరి

మొదట బాబ కోపపడిన
పిదప వారి భక్తికి హ
ర్షించి మందహాసాలను
చిందించుచు చూచుచుండె

విసిరిన గోధుమ పిండిని
వెలదులు నలువురు సమముగ
పంచుకొనియు నెత్తుకొనుట
బాబా గమనించినాడు

ప్రశాంతముగ నున్న బాబ
భగ్గున మండుచు లేచెను
దూషణ బాణాల వాళ్ల
తూలనాడగా సాగెను

ఓ మహిళల్లారా మీ
కేమైనా పిచ్చెక్కెన?

ఎవ్వడబ్బ సొమ్మని మీ
రిట్లు దోచుకొనుచుంటిరి.

అరువుగ మీ తో నేనే
మైన పిండి కొని యుంటిన?
ఇట్లు మీరు నా పిండిని
ఎత్తుక పోవుచునుంటిరి.

ఓ వనితల్లారా! మీ
రొక కార్యము చేయవలయు
మీరీ పిండిని గైకొని
ఊరి మేరలో చల్లుడు

అంతట బాబా చెప్పిన
యట్ల వారు చేసినారు
గ్రామములో రేగినట్టి
గత్తర వెంటనె సమసెను,

గ్రామములో చెలరేగిన
కలరాయను మహమ్మారి
విసరబడ్డ పిండివోలె
విసరి పార ద్రోలబడెను.

ఆ గత్తర రాకాసిని
అట్లు విసరి పిండి చేసి
ఊరి బయట పారవేసి
దూరముగా తరిమినాడు.

ప్రతి రోజున బాబా తన
భక్త జనుల పీడించెడి
విపత్తులను పొడిపొడిగా
విసరి విసరి పారవేయు

బాబా లీలలు పొగడగ
పదములు చాలవు భావమ
దంత కన్న చాలక బా
ష్పాంబువులై వర్షించును

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవనపరమార్ధమరయు
త్రోవను గనరారండీ!

## అల్లామాలిక్

అల్లామాలిక్ అంటాడు
అన్నిప్రాణులందుంటాడు
చరణములంటీ శరణమన్నచో
చల్లగ చూస్తానంటాడు

అల్లా తానై తానల్లాయై
అల్లామాలిక్ అంటాడు
అహము వీడితానల్లాయై ఒక
యాచకుడను నేనంటాడు

భికారితానై ఫకీరుతానై
భిక్షాందేహీ! అంటాడు
భిక్షతోడనే పీడలగొంటూ
రక్షణలిస్తా నంటాడు.

సర్వభూతముల తానున్నానని
చాటి చెప్పుచూ ఉంటాడు

త్యాగనిరతి ప్రతి ప్రాణికోసమై
జాగృతికావాలంటాడు
ఆకలితో ఏరూపుననైనా
యాచనచేస్తా నంటాడు
సకల భూతములు తానుగనెంచి
జాలిజూపుడని అంటాడు. ॥అల్లా॥

సాయీ అంటూ శరణమన్నచో
చప్పున కాస్తానంటాడు
శిక్షాపాత్రుని శిక్షితుజేసి
రక్షిస్తానని అంటాడు

శ్రద్ధ సబూరీ, రెండు కానుకలు
సమర్పించు కొనమంటాడు
ప్రాణికోటి పై జాలీప్రేమా
సదాచూపుడని అంటాడు

అల్లా భలా కరేగా అంటూ
చల్లగ దీవనలిస్తాడు
అసల్‌హక్ నేకానంటాడు
యాదేహక్ ననిఅంటాడు

అల్లామేలొనరించుగాక అని
చల్లగ దీవెనలిస్తాడు
భగవంతుడ నేకానంటాడు
భగవద్ధ్యానిని అంటాడు

అనల్ హక్-భగవంతుడు
యాదేహక్ - భగవంతుని ధ్యానించు వాడు

అల్లామాలిక్ అంటాడు
అన్ని ప్రాణులందుంటాడు
చరణములంటీ శరణమన్నచో
చల్లగచూస్తానంటాడు.

॥శ్రీశిరిడీ సాయి చరిత॥

## శ్రీ సాయి ఏకాదశ సూత్రములు

శిర్డి ప్రవేశమె సకలా
రిష్టదుఃఖ పరిహారము 1

ఆర్తులైన నేమీ నిరు
పేదలైన నేమీ ద్వా
రకమాయిప్రవేశముతో
సుఖసంపదలందగలరు. 2

ఈ దేహము పిదప కూడ
నేను అప్రమత్తుడనే 3

నాభక్తుల సంరక్షణ
నాసమాధినుండి వెడలు 4

నాసమాధి నుండియె నే
నన్ని పనులు నిర్వహింతు 5

నామానుషదేహము నా
సమాధి నుండె మాట్లాడును 6

శరణమన్న వారి నిరం
తరము కాచుటే నావిధి 7

ఏరు నన్ను జూచెదరో
వారిని కడగంట జూతు 8

మీభారములన్నియు నా
మీదుంచుడు నెమోసెద 9

సలహా సాయాలడిగిన
సత్వరమే నేనొసగెద 10

నాభక్తుల గృహములనుం
దదు లేమిడియను శబ్దము 11

అను ఏకాదశ సూత్రము
లాలించిన కలుగుశుభము

శుభమస్తు

# శరణాంజలి

సాయి నీకృప మాపయి జాలువార
దేల? మావల్ల దోషమేదైన యున్న
దాని మాపు దయానిధీ! త్వరితముగను
శరణు శరణు సాయీ నన్ను కరుణజూడు

సాయి నినుబొగడగ నాకు శక్తి చాల
దయిన పసివాడు మాట్లాడు నట్లునేను
నిన్ను బొగడగ యెట్లొయత్నించుచుంటి
నన్నుకృతకృత్యు జేయవే కన్నతండ్రి!

సాయి చరణాబ్జములె నాకు శరణమగుత
సాయి కరుణామృతమె నాకు జయమునిడుత
శిరమువాలిచి కైమోడ్తు శిరిడివిభున
కస్మదీయ కార్యము జయమగుట కొరకు

సాయి సద్గురు సర్వేశ శరణు శరణు
దిక్కునీవని నమ్మితి దీనబంధు
చిక్కుతొలగించి కార్యము చక్కబరుచు
భారమంతయు నీదే శుభప్రదాత!

చంచలుడ నీ పదాబ్జాల జారవిడుతు
నేమొ మార్జాల పద్ధతి నేలుకొనుము
నాకు దిక్కెల్ల నీవె కరుణాల వాల
నన్ను కృతకృత్యు జేయువిపన్నపాల!

నేను నేనను భావంబు క్షీణమయ్యె
ఈవు దప్పనితః పరంబెరుగనయ్య
నీవులేకుండ నేదైన నెగుడగలదె!
దారమేలేక పుష్పాలహారమగునె!

పతిత పావన నీ పాదపద్మములను
బట్టుకొన్నాడనన్ను కాపాడరావె!
తనదు ఒడిజేరు బిడ్డనేతల్లియైన
రక్షసేయదె సాయీ ఉపేక్షతగున?

ప్రాంగణము శుద్ధిపరుచగా శ్రద్ధలేదు
భూమిదున్నుకొనంగ సబూరిలేదు
చెత్తవాకిట కాలిడ చిత్తమగునె
సాయినింకెట్లు దర్శింతు నేమి సేతు

పరమపావనమైన నీ పాదములను
పట్టుకొనువేళ మలినమైనట్టి నాదు
హస్తమలినము నీ పదాలంటుగాన
కరుణ కురిపించు మలినము కడిగివేయ

హేప్రభూ! హేదయాకర! హేకృపాళు!
దీన బాంధవ! శ్రీ సాయి దేవదేవ!
శరణు శరణు సాయీ ప్రభో! శరణు శరణు!
సత్వరమెనన్ను కరుణించు సాయినాథ!

జయముజయము సాయీ నీకు జయము జయము
జయము గూర్చుము నాకు నిశ్చయముగాను
ఈవుదప్ప నితఃపరంబెరుగస్వామి!
ఈవె సర్వేశ్వరుడవని యెంతుసాయి!

సాయి నీకిదియె శరణాంజలి ఘటించి
పద్యకుసుమాల మాల నీ పాదములకు
నర్పణము సేసితిక నీకటాక్షమాల
మంగళములను గూర్చుత మాకునెపుడు

**ఓం తత్సత్**

# మంగళగీతి

మంగళమగు శ్రీ శిరిడీ సాయికి
మంగళమగు శ్రీ సద్గురు సాయికి
మంగళమగు ఈ కృతిపతి సాయికి
మంగళమగు ఈ మహీజనాళికి

మంగళమగు జయ మంగళమగు శుభ
మంగళమగు శ్రీ శిరిడీ సాయికి
మంగళకరుడగు మంగళమూర్తికి
మంగళమగు శ్రీ సద్గురు సాయికి

మానవాళి దుఃఖార్తుల బాపగ
మానవ రూపముదాల్చిన సాయికి
మంగళమగు శ్రీ శిరిడీ సాయికి
మంగళమగు శ్రీ సద్గురు సాయికి

మంగళమగు ఇదివ్రాసిన వారికి
మంగళమగు ఇది పాడిన వారికి
మంగళమగు ఇది విన్న జనాళికి
మంగళమగు శ్రీ శిరిడీ సాయికి.

మంగళమ్ గురుదేవాయ
మహనీయగుణాత్మ నే
సర్వలోక శరణ్యాయ
సాధురూపాయ మంగళమ్

**మంగళమ్ మహత్**



అనంతకోటి బ్రహ్మాండనాయక
రాజాధిరాజయోగి రాజపరబ్రహ్మః
శ్రీసచ్చిదానంద సద్గురు
సాయినాథ మహారాజ్‌కి జై
శ్రీశిరిడీ సాయి నాథార్పణమస్తు

**శుభమస్తు**

దాబోల్కరు డటనుంటను
తన ప్రశ్నకు తగిన సమా
ధానము ప్రాప్తించెననుచు
తన వాదము వృథాయనుచు
గురువు యొక్క అవశ్యకత
గుర్తెరింగి తృప్తిపడెను.
॥శ్రీ శిరిడి సాయి చరిత॥

మంగళమ్ గురుదేవాయ
మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ
సాధు రూపాయ మంగళమ్!

## బాబా భక్తవత్సలత మతసామరస్యత

మసీదు నందున్న గురుని
మహల్సపతి దర్శించగ
వచ్చినాడు కాని అతని
వారించిరి ప్రవేశించ

హిందువులను మా మసీదు
నందు ప్రవేశించ నీము
అనుచు మహల్సాను అడ్డు
కొనిరి ముసల్మానులపుడు.

నా గురువును చూడకుండ
నన్ను అడ్డగింతురా? అని
ముందున కరుదెంచు నతని
మోదినారు బడితె తోడ

సాయీ అని పిలిచె మహ
ల్సాపతి, వెంటనె సాయీ
భగవానుడు అరచినాడు
భక్తుని ఆక్రందన విని

భక్తులు భయపడిలోనికి
పరుగున నరుదెంచినారు
బాబా వీపున నెత్తురు
ప్రవహించుట చూచినారు.

భక్తుని బాదిన దెబ్బలు
బాబా పైగాన్పించెను
బాబా గాయాలు చూచి
భక్తులు దుఃఖించినారు

మహమ్మదీయులంత దెలిసి
మహల్సాను లోనికరుగ
అనుమతించినారు మతాం
ధ్యము తొలగెను వెలుగయ్యెను.

మరియొక సందర్భ మందు
మహమ దీయులను ద్వారక
మాయి మసీద్‌లోనికి రా
నీయక హిందువులడ్డిరి.

అపుడు సాయి ఆ మసీదు
నందదృశ్యుడై పోయెను
హిందువులకు కనువిప్పై
పొందిరి బాబాను శరణు.

# శ్రీ శిరిడీ సాయి చరితామృతము

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

ఎప్పుడెప్పుడు ధర్మము నశి
యించి అధర్మము హెచ్చున
అప్పుడప్పుడు ధర్మరక్ష
ణార్థ మవతరింతునేను.

అని భగవానుడు పలికిన
అమృత వచోక్తులను బట్టి
మానవ రూపంలో భగ
వానుడవతరించుచుండు.

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

## జననం

మహారాష్ట్ర మందొక గ్రా
మమున సాఠె కులాన్వయులు
లక్ష్మీహరికృష్ణ లనెడి
బ్రాహ్మణ దంపతులుండిరి.

ధర్మరతులు వారు పూర్వ
కర్మ ఫలముచే వారికి
కలిగిన ప్రతి సంతానము
నిలువక నశియించుచుండె.

గర్భశోక మది వారికి
దుర్భరమై పోగ వారు
ఆత్మహత్య చేసికొనగ
అడవి మధ్య కేగినారు.

అపుడొక వటతరువు క్రింద
ఉపవిష్టులు కాదలంచి
రాలిపడిన వటపత్రము
లను ప్రక్కకు ప్రోవుచేసి

హరిని స్మరించుచు లక్ష్మీ
హరికృష్ణలు అచ్చోటను
ఉపస్థితులు గా బోవగ
అపుడొక చిత్రము గలిగెను.

ప్రక్క ప్రోవు చేసినట్టి
పత్రము లందుండియె ఒక
పసిపాపని రోదనమ్ము
ప్రణవమట్లు వినిపించెను.

విడువబోవు ప్రాణములవి
తడబాటున లేచివచ్చె
వట పత్రము లందున ది
వ్యప్రభలే గానవచ్చె.

## లక్ష్మిబాయి షిండె

**(నవపథములు)**

చిననాట భర్త పో
యిన భాగ్యహీను రా
లామె యాత్రార్థమై
అరుదెంచినది శిరిడి

శ్రీ మంతురాలు ల
క్ష్మీబాయి షిండె!
శిరిడి లోనే ఆమె
స్థిరవాస ముండె!

సిరిసంపదలు గలిగి
నిరుపేదరాలివలె
జీవించుచును సాయి
సేవలో నుండె!

తా సమాధిని జెందు
తరుణమున సాయి ల
క్ష్మీ బాయి కొసగె తొ
మ్మిది వెండి రూప్యములు

భవ సాగరము దాటి
పరమా వధిని జేర
నవ విధంబుల భక్తి
నావలున్న వటంచు
నవరూప్యముల నిచ్చినాడు
నవ పథంబులు జూపినాడు

శ్రవణమ్ము, మననమ్ము
సంకీర్తనము, అర్చ
నము, సేవనము, వంద
నము, దాస్యమును,సఖ్య
మును, నివేదనములివి
ముక్తి పథములటంచు
నవరూప్యముల నిచ్చినాడు!
నవపథములను జూపినాడు!

॥శ్రీ శిరిడీ సాయి చరిత॥

## అప్పుచేసి దర్శించుటకన్న ఆత్మ సందర్శనం మేలు

బాబను దర్శించు కొనగ
భక్తుడొకడు అప్పుచేసి
శిరిడీ కరుదెంచి బాబ
చరణములకు ప్రణమిల్లెను

భక్తుని ఆశీర్వదించి
బాబా ఇట్లని పలికెను
ఇంటి వద్ద నుండియె నను
ఎద దలచిన అగుపడనా?

అప్పు చేసి యింతవరకు
అరుదెంచగ రావలెనా?
అని యాత్రా పర్వాలకు
అప్పు చేయ రాదంచును

ధ్యాన మందిరమున పరం
ధాముని దర్శించుడనుచు
సన్మార్గము జూపినాడు
సద్గురుండు సాయి విభుడు

॥శ్రీ శిరిడి సాయి చరిత॥

కొనియాడుట గానవచ్చె
కొనియాడరె సాయిలీల!

ఏరూపము నందైనను
ఏతెంచెద నేను గాన
ప్రాణికోటి పైన జాలి
బూని యుండవలయునంచు,

ఏరూపము లోనవైన
నారూపము గనజాలిన
వారికి సిద్ధించును కై
వల్యమనుచు సాయివిభుడు
సమహితత్వమను వేదాం
తము బోధించెను నరులకు

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థమరయు
త్రోవను గనరారండీ!

## సేవాతత్పరురాలు రాధాకృష్ణమాయి

రాధకృష్ణమాయి సౌమ్యు
రాలు చిన్న తనములోన
భర్తను గోల్పోయి సాయి
బాబా సన్నిధి జేరెను

సాయీ దర్బారున కే
సామానులు అవసరమో
వాటిని భక్తులకు జెప్పి
పాటవముగ గూర్చుచుండె

ప్రతి దినము మసీదు శుభ్ర
పరుచుచు బాబానడిచే
వీధులన్ని ఊడ్చుచు ధుని
వేదిక పరిశుభ్ర పరుచు,

శ్రద్ధా భక్తుల శిరిడీ
సంస్థానానికి తగు ఏ
ర్పాటులన్ని చూచుకొనుచు
పద్ధతిగా నడిపించెను

ప్రతిదిన మామెకు బాబా
పంపుచుండు భోజనమును
బాబా పంపిన భోజన
మే భుజించు వేరు తినదు

బాబను భగవానునిగా
భక్తితోడ సేవించెను
బ్రతికినంత కాలము బా
బా సన్నిధి జీవించెను

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ
జీవన పరమార్థమరయు
త్రోవను గనరారండీ!

టును వీడెను కాని ఆమె
కనుగొన దయ్యెను బాబను

ఆజ్ఞానాంధ్యము క్రమ్మిన
అగుపడునా భగవంతుడు?
సూర్యుడుండగా వెలుగును
చూడగలుగునా అంధుడు?

ఆ నాడును బాబా తన
ఆ వాసము రాలేదని
ఆమె ఖిన్నురాలై బా
బా మందిర మరుదెంచెను

అపుడు బాబ అచట జేరి
నట్టి వారికెల్లరకును
తన వీపున గల గాయము
లను చూపుచు నుండినాడు

అదిగని ఆయమ బాబా!
ఇది ఏమని బాధతోడ
అడిగెనంత బాబా ఇ
ట్లని పలికెను ఆమెతోడ

నీ యింటికి విందుసేయ
నే వచ్చితి నీవు నన్ను
కఱ్ఱతోడ కొట్టినట్టి
గాయములివి చూడుతల్లి!

అని పలికిన బాబ మాట
లను వినినంతటనే ఆ

యమ్మ మిగుల దుఃఖ వివశ
యై బాబా పదములపై
బడి విలపించగ సాగెను
పశ్చాత్తాపము జెందెను

అమ్మా నే మరల వచ్చి
ఆరగింతు నీ విందును
అని బాబా జాలినిగొని
ఆయమ నోదార్చినాడు

ఆ మరుసటి రోజు గండు
చీమల రూపాన వచ్చి
ఆయమ ప్రియమార జేసి
నట్టి మధుర మధుర మైన
పేణీలను ఆరగించె
ప్రీతి తోడ సాయి విభుడు

ఆదియును తానెరుగ కుంట
ఆయమ మరుసటి రోజున
బాబా దగ్గరకు వెళ్లి
ప్రశ్నించెను రాలేదని

అంత బాబ చూడుమనుచు
అందరకగు పడునట్లుగ
కఫనీ పైకెత్తి, బొడ్డు
కడ చీమలు చుట్టుచేరి

పేణీముక్కల నోటను
వింతగొలుపునట్లు గఱచు

ఎదపీట వేసికొని
ఎదురు చూచుచునుండె.

ఆరుగంటల సమయ
మైనదపుడొక కుక్క
పోళీలు దినబోవ
పొలతి దానిని కసరి
ఇనుప కర్రను విసర
శునక మపుడా వ్రేటు

తప్పించుకొని పోయి
తరుణి వైపే దీన
ముగ చూచుచును తొలగి
పోయినది కటకటా!
ఇల్లాలు యెరుగ దావేళ!
అల్లమాలిక్ వానిలీల!

ఎంతగా బాబకై
ఎదురు చూచినగాని
రాడాయె-రాని కా
రణమేమిటని గృహిణి
బాబ సన్నిధి కరుగుదెంచె!
బాబనే ఇట్లు ప్రశ్నించె!

బాబా! విందారగించ
వచ్చెదనని మాట ఇచ్చి
రావైతివి ఏలా అని
రమణి బాబనడిగెనంత.

అమ్మా! నేనెప్పుడైన
ఆడి తప్పు వాడకాను

శ్వానము రూపములోనే
వచ్చి నీదు పోళీలను
మచ్చికతో తినబోగా
మచ్చరమున నీవునన్ను
కసరినావు ఇనుపకర్ర
విసరి కొట్టినావు కదా!

అని బాబా పలికినంత
ఆమె మిగుల కలతజెంది
అపరాధము మన్నింపుము
అనిబాబను వేడుకొనెను

అమ్మా! వగవకు రేపే
అరుదెంచెద నీయింటికి
అని బాబా జాలిని గొని
ఆమెకు వాగ్దానమిచ్చె

ఆమె పిండి వంటలెన్నో
ప్రేమతోడ చేసి, బాబ
కెదురు చూడ సాగెనపుడు
ఏతెంచిన దొక మహిషము

అది ఆ తిను బండారము
ఆరగించ బోవుచుండ
కట్టెనుగొని ఆ యమ ఆ
బట్టెను వీవున బాదెను

గాయపడినదై రక్తము
గారుచుండ అది అచ్చో

చేసుక తెచ్చెను-బాబా
చేతికందుకొని వాటిని
ప్రక్కన నిల్చున్న నల్ల
కుక్కకు తినిపించసాగె

ఆకలి అని చెప్పి తెచ్చి
నాక ఇట్లు చేసితేల?
కొంచమైన రుచిచూడక
కుక్కకు పడవేసి తేల?

అని అడిగిన లక్ష్మితోడ
అమ్మా! దీనికి కూడా
ఆకులుంది. దీనిలోన
నేనే యుంటిని కాదా
నీకేటికి సందేహము?

ప్రతి ప్రాణిలోన నేను
ప్రత్యక్షముగా నుంటిని
నీలోనను నేనుంటిని
నీ ఆకలి నాదే కద!

సమభావము తోడ నేను
సకల జీవులందుంటిని
అని లక్ష్మిబాయి తోడ
అఖిలేశుడు వివరించెను

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

## సమహితతత్వబోధ

**(సాయి ఏ రూపంలోనైన రావచ్చు-**
**ఏ ప్రాణిని హింసించరాదు)**

తాత్యకోటీ భార్య
తన ఇంట విందార
గించ రమ్మనుచు ప్రా
ర్థించినది బాబాను

అంత సాయంత్రమున
కారుగంటలకు నే
తప్పకుండగ వచ్చె
దను కాని నను కసరు
కొన కూడదని పలికినాడు
వెనుక ముందుల దెలియువాడు!

భగవానులను మిమ్ము
భక్తి పూజించెదము
కాని మిమ్ముల మేము
కసరి కొట్టుటయా! య
టంచు పలికినది ఆ రమణి!
ఆయమ్మ యెంత సద్గృహిణి!

అట్లైన నే తప్ప
కరుదెంతు నని బాబ
పలికె నంతట ఆమె
పరమ సంతోషమున

పోళీలు చేసి ఒక
పళ్లెరము లోనుంచి

భక్తురాలు కమ్మరి పని
వాని భార్య పసిబిడ్డను
ఒడిలో బెట్టుక కొలిమిని
ఊపుచుండగా అప్పుడు

జబ్బు వద్ద భర్త పిలువ
చప్పున పోబోవ ఆమె
పసిబిడ్డడు ఒడిని జారి
పడిపోయెను కొలిమిలోన

అప్పుడామె బాబా అని
ఆర్తితోడ నను బిలిచెను
అంతనేను ఆ బిడ్డను
అగ్నినుండి రక్షించితి

ఆర్తుల రక్షించుటయే
అస్మదీయ కర్తవ్యము
అల్లా సబ్‌కా మాలిక్
ఆశ్రిత జన మందారము

॥శ్రీ శిరిడి సాయి చరిత॥

## బాగోజీనిండుభక్తి

కాలిన చేతికి వైద్యము
గావించగ శ్యామా ఒక
వైద్యుని పిలిపించె కాని
వైద్యము వలదనెను బాబ.

అల్లాయే నాకు వైద్యు
డని పలుకుచు సాయిబాబ
బాగోజీ అనెడు కుష్టు
రోగి చేత తనచేతికి
ప్రతినిత్యము నేతితోడ
పట్టి కట్టుమని అడిగెను.

అతడట్లే యొనరించెను
అతని కుష్టునయమాయెను
పరోపకార మంధర్ధము
బాబా జగతికి చాటెను.

బాగోజీ తనకు కుష్టు
బాగైనను బాబా సే
వలు విడక సమాధి జెందు
వరకు చేయుచుండువాడు.

అతని భక్తి నిండైనది
అతనిభక్తి నిజమైనది
అతనిభక్తియే బాబా
కమితముగా ప్రియమైనది.

శ్రీ శిరిడి సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్ధమరయు
త్రోవను గనరారండీ!

## సర్వప్రాణులలో బాబా

(ఆత్మవత్సర్వ భూతాని యఃపశ్యతిసపశ్యతి)

అమ్మ లక్ష్మిబాయీ నా
కాకలి అవుతున్నది అని
బాబా అడిగెను వెంటనె
బాయమ రొట్టెలు కూరలు

అని దీనముగా వేడుచు
ఆయమ విలపించుచుండ
దయాసింధు దీనబంధు
సాయి ప్రభు జాలినిగొని,

అమ్మా! నీకంతగ నా
యందున నమ్మకముండిన
ఈ ఊదినిగొని దీనిని
మీ ఆయన శవము మీద
రాచి చూడు మీ ఆయన
బ్రతుక గలడొ ఏమో అనె

అంతటామె బాబ యిచ్చి
నట్టి ఊదిగొని దృఢ వి
శ్వాసముతో భర్త కళే
బరము మీద రాచెనపుడు.

త్వరితముగా నిదురలేచు
వాని పగిది మరణించిన
ఆమె భర్త కదలి లేచి
యధా విధిగ జీవించెను.

ఇది బాబా ఊది మహిమ
మృత జీవిని బ్రతికించెను
దీనిని నమ్మిన వారిని
దివ్యౌషధమై ప్రోచును.
ఆవో కల్యాణ రామ ఆవో ఆవో!
లావో ఊదీకెథైలె లావో లావో!

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

## ఆపత్బాంధవుడు బాబా
### (కమ్మరి ఇల్లాలు)

శ్రీ శిరిడీ సాయి చరిత
జీవాత్మా వినుమా! ఓ
సాయీ! అని పిలిచినంత
సంరక్షణ కలుగుసుమా!

పందొమ్మిది నూట పదవ
వత్సరమున దీపావళి
నాడు చిత్రమొకటి జరిగి
నది దానిని వినరండీ!

ధుని ముందర బాబా గూ
ర్చుని కట్టెలు వేయుచుండె
ఉండి ఉండి బాబా ఆ
మండుచున్న ధుని లోపల
చేయిపెట్టినాడు అంత
చేయికాలి కమిలి పోయె.

సమీపాన ఉన్న శ్యామ
చప్పున అటు కరుగుదెంచి
బాబ చేయి లాగివేసి
బాబా! ఇది యేమిటి పని
అని అడిగెను అంతట ఇ
ట్లని చెప్పెను సాయి విభుడు

రామకృష్ణ పరమహంస
నామముతో వెలయువాడు.

అతడు నేను భగవదంశ
లందు జనించిన వారము
ఆయన నిర్యాణోన్ముఖు
డై యుండెను-అతని తోడ.

దేవరహస్యములు సంప్ర
దించి పిదప ఆతడు అవ
తారము చాలించెను నే
తరలివచ్చి నాభౌతిక
దేహమ్మును ప్రవేశించి
తిని అని బాబా నుడినెను.

శ్లో. యదాయదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్
(భ. అ4. శ్లో7)

ఎప్పుడెప్పుడు ధర్మము నశి
యించి అధర్మము హెచ్చునో
అప్పుడపుడు ధర్మరక్ష
ణార్థ మవతరింతునేను.
అని భగవానుడు పలికిన
అమృత వచోక్తులను బట్టి
మానవ రూపములో భగ
వానుడవతరించుచుండు.

॥శ్రీ శిరడీ సాయి చరిత॥

## చచ్చిన వాడిని బ్రతికించుట

పాముకరిచి చచ్చిన తన
భర్తను బ్రతికించు కొనగ
గృహిణి యొకతె బాబా దరి
కేగుదెంచె రోదించుచు

బాబా పాదాల మీద
బడి జాలిగ ఏడ్చుచు తన
భర్తను బ్రతికించు మనుచు
పలువిధముల వేడు కొనెను.

అంత బాబ ఆమెతోడ
అమ్మా నీవెక్కడైన
మృతి జెందిన వాడు భువిని
బ్రతుకుట విన్నావా? చ
చ్చిన నీ పతి బ్రతుకుట ఖ
చ్చితముగ సాధ్యంబుగాదు.

అని బాబా యెంత చెప్పి
నను ఆయమ విలపించుచు
భర్తను బ్రతికించుకొనగ
బాబా పదముల వీడక,

బాబా! యెట్లైనను నా
భర్తను బ్రతికించి తీర
వలె- దేవుడ వీవు నీకు
వశముకాని దొకటుండదు.

ప్రాణి కోటి ప్రేమించుట
బ్రహ్మమునే తెలిసికొనుట
పెద్దల కడకేగి నీవు
బుద్ధి గలిగి బ్రహ్మజ్ఞా
నమ్ము నెరుగుమని బాబా
నెమ్మదిగా మందలించె

అపుడా ధనికుడు తనలో
అవగుణాల నెరిగి, బుద్ధి
గలిగి త్యాగబుద్ధితోడ
మెలగుచు బ్రతుకంగ నేర్చె
॥శ్రీ శిరిడీ సాయి చరిత॥

## బాబా మూడు రోజులు శరీరము వీడి మరలివచ్చుట

అది పద్దెనిమిది ఎనబై
ఆరవ వర్షము బాబా
తన భక్తుల జేరబిలిచి
తన ప్రియతమ భక్తుండును
పారమార్థికుడు మహల్స
పతితో నిట్లని పలికెను.

ఈ నాదేహమ్మును నీ
వెవ్వేళల గాపాడుము
దిన త్రయము గడువగనే
తిరిగి ప్రవేశింతు దీని.

కాకుండిన దీని ద్వార
కామాయికి ఎదురు స్థలము
నందున సమాధి యొనర్చి
అచట రెండు జెండాలను.

పాతిపెట్టుడని మహల్స
పతి తొడపై తలను మోపి
ప్రాణములను వీడి సాయి
బాబా యెటకోవెళ్లెను.

చలనరహితమై మహ
ల్సాపతి తొడ మీద నున్న
బాబా దేహమ్మును ఆ
భక్తుడు కంటికి రెప్పగ
గాపాడుచు నుండెనంత
గడిచిపోయె దినత్రయము.

జడ మతులా శరీరమును
సమాధి యొనరింతు మనిరి
కాని మహల్సా దానిని
కంటిరెప్పవలె గాచెను.

అంత నాలుగవ రోజుద
యాన బాబ యథాస్థితిని
కూర్చుండెను జనులు సంభ్ర
మాశ్చర్య విచలితులైరి.

అపుడు మహల్సాపతి బా
బా! ఈ మూడు దినమ్ములు
ఎటకేగితిరేమి చేసి
తెరిగింపుండని యడిగెను.
బాబా సంప్రీతుడగుచు
పలికెనిట్లు అతనితోడ.

వంగదేశమున పుట్టిన
గంగాధరు డనెడి వాడు

నందు నడిగి నే నిమ్మని
తొందరగా ఐదురూక

లడిగి తెమ్ము మనగా వా
డడిగి వచ్చి నందుడు లే
డని చెప్పెను బాలాజీ
నడిగి తెమ్ము మనగా వా

డడిగి వచ్చి వాడును లే
డని చెప్పెను ఇట్లే ఇం
కను కొందరి నడిగి తెమ్ము
మనగ వారు లేకుండిరి

తన జేబున ధనముండియు
ధనికుండిది చూచుచు బా
బాకు ఐదు రూప్యంబుల
నీ కుండెను, పైగ తనకు
అలస్యమ్మగు చున్నది
అనుచు చిందు లాడ జొచ్చె.

అపుడు బాబ ధనికునితో
ననె నిట్లని ఓయీ! బా
లుని బ్రహ్మము తెచ్చుటకే
పంపియుంటి ఎవరు లేరు.

ఐనా నీ జేబులోన
ఐదు ఐదు రూపాయల
రూపములోనే బ్రహ్మము
రూఢిగ నున్నాడు గదా!

నే నిందర నడుగుచుండ
నీ జేబున ధనముండియు
ఇత్తునన్న జ్ఞానము నీ
కింతయైన లేదుకాని
బ్రహ్మజ్ఞానము కావలె
పైసలకది దొరుకునదా?

ఒక్క ఐదు రూకలిచ్చి
ఒకరి నాదు కొనెడి త్యాగ
బుద్ధిలేక ధనము మీది
మోజు వీడ లేనివాడు.

సర్వ ప్రాణులందు నుండు
సర్వేశుని గాంచునా?
స్వార్థముతో సమతలోని
సౌందర్యము జూచునా?
బ్రహ్మజ్ఞానము కావలె
పైసలకది దొరుకునా?

బ్రహ్మమనగ సర్వేశుడు
బ్రహ్మజ్ఞానంబనగా
సర్వేశుని తెలిసికొనుట
స్వార్థబుద్ధి మానుకొనుట

తనయందును సర్వభూత
తతియందును సర్వేశుడు
గలడను సద్భావముతో
మెలగు తత్వమే బ్రహ్మము

హిందూ ముస్లిము లిరువురు
ఏకముగా ఒకే రోజు
చందనోత్సవమును రామ
జన్మనవమి ఉత్సవమును
సాయి జన్మదినమునాడు
జరుపుకొనుచు నుండువారు

అందరి యజమాని ఒకడె
అతడే అల్లా ఈశ్వరు
డని బోధించిన సాయీ
అమృత వాక్కులను వినుడీ!

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

## జ్ఞానంలేదు కాని బ్రహ్మజ్ఞానం కావాలి
### (ఒక ధనికుడైన మూర్ఖుడు)

అష్టైశ్వర్యమ్ములతో
అలరారెడు ధనికుడొకడు
బ్రహ్మజ్ఞానమును పొంద
బాబా దరికేగుదెంచె

ధన సంపాదనలో ఒక
క్షణము తీరకుండుట చే
టాంగను రాన్పోనుకు మా
ట్లాడు కొని ప్రయాణమయ్యె

వడివడి ద్వారక మాయికి
వచ్చినాడు టాంగా దిగి
భక్తుల నెల్లర దాటుచు
బాబా దరి కేగినాడు

మ్రొక్కుబడిగ బాబ పాద
ములకు మ్రొక్కి బాబా! నా
కేమాత్రము వ్యవధి లేదు,
ఇచ్చేయుడు నాకు వేగ
బ్రహ్మజ్ఞానము, నావ్యా
పారము విడి వచ్చినాను

అని అడిగిన యంత బాబ
అతనికి గుణపాఠముతో
జ్ఞాన బోధ గావించిన
వైనము వివరింతు వినుడు

అపుడు బాబ ఇట్లని యెను
అందరు ఐహిక సుఖముల
గోరివచ్చెదరు కానీ
కోరిక పడి నీవలె బ్ర

హ్మ జ్ఞానము పొందగోరు
మహితాత్ములు రారెవ్వరు.
ఆహా ఇది ఎంత సుదిన
మది త్వరగా నీకిచ్చెద

నని మాటల మధ్యన బా
లుని ఒకనిని బిలిచి నీవు

రోగ మౌషధము సేవించుటచే
బాగగు కానీ శిరిడికి పోయీ
బాబను ప్రార్థించిన బాగగునా?
బలే వాడివని అపహసించితిమి.

సర్వజ్ఞుండగు సాయినాథుడీ
సంగతి నెరుగును అని పండరిలో
జరిగినట్టి సంఘటనము వెల్లడి
పరిచెను ఆ పండరి పురి ప్లీడరు

అంతాతానై అన్నిటతానై
అల్లా మాలిక్ అంటాడూ
ఇంటా బైటా ఎక్కడ ఉన్నా
ఎవరేమన్నా వింటాడూ!

కనులు మూసికొని పాలు త్రాగుచును
తననెవ్వరు చూచుట లేదనుకొను
పిల్లివంటి నరులుండిరి దేవుని
కళ్ళుగప్పుగా సాధ్యంబగునా?

ఇక్కడ అక్కడ ఎక్కడ ఉన్నా
ఎవరేమన్నా వింటాడూ
అంతా తానై అన్నిట తానై
అల్లా మాలిక్ అంటాడూ.
ఇంటాబైటా ఇక్కడ అక్కడ
ఎక్కడ చూచిన ఉంటాడూ
ఎవరేమన్నా వింటాడూ
అల్లా మాలిక్ అంటాడూ
అంతా తానై ఉంటాడూ.

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థమరయు
త్రోవనుగన రారండీ!

## సర్వమత సామరస్యము

సర్వభూతముల యందున
సమతాభావంబు గలిగి
సర్వమతంబుల యందున
సమరస భావంబు గలిగి.

సర్వంబ్రహ్మ మయంబను
సర్వజ్ఞుడు బ్రహ్మజ్ఞుడు
సర్వభూత దయాపరుడు
సకలలోక రక్షకుండు

సాయి మహాత్ముడు శిరిడీ
సంస్థానము నందు వెలసి
సమరస భావంబు నెరపి
జగతికి మార్గము జూపెను.

రాముడు హిందువులందున
రహీమ్ మహమదీయులందు
ఒకడె దేవుడని చెప్పుచు
నుండువాడు సాయి విభుడు

ప్రేమయు, దయయును, భక్తియు
విశ్వాసము ఈ నాలుగు
గుణములు బోధించువాడు
అను నిత్యము ఆశ్రితులకు

కరుగుదెంచి టికటిదిగో!
విరమించితి నాపయనము

దీనినిగొని మీరింక ప్ర
యాణము సేయగ వచ్చని
అంతర్ధాన మ్మాయెను
అది అద్భుత సంఘటనము

షిరిడి జేరి బలరామ్ తన
జీవితాంత మచ్చటనే
గడిపి ధన్యుడై అచటనె
కైవల్య ప్రాప్తి నొందె-

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థమరయు
త్రోవను గనరారండీ!.

## బాబా సర్వజ్ఞుడు

### (పండరీపురి ప్లీడరు)

అంతా తానై అన్నిట తానై
అల్లా మాలిక్ అంటాడూ!
ఇంటా బైటా ఇక్కడ అక్కడ
ఎక్కడ చూచిన ఉంటాడు!

పండరి పురమున ప్లీడరొకండూ
బాబా దర్శనమునకై వచ్చెను
బాబా పదములపై బడి మ్రొక్కెను
బాబకు దక్షిణ కోరక యిచ్చెను.

కొలువు కూటమున కొలది దూరమున
కూర్చుని ప్లీడరు బాబా వాక్కులు
వినుచునుండగా బాబా అపుడా
ప్లీడరువైపుకు చూచుచిట్లనెను.

ప్రజలెంతటి టక్కరులో చూడుడు!
పదముల బడెదరు దక్షిణలిత్తురు
పిమ్మట నిందింతురు ఏమందును
ప్లీడరుకీ టోపీ సరిపోయెను.
కనుకనె దీనిని అతడు ధరించెను
అనుచు పొడుపుగా బాబానుడివెను.

ఎందుల కిట్లని బాబా పలికెనొ
ఎవ్వరి కర్థము కాక పోయెను
ప్లీడరు తన బసకేగిన పిమ్మట
వివరించెను కాకా సాహెబుతో-

ఆ మాటలు తనకే అన్వయ మగు
నని పూర్వము పండరిలో జరిగిన
సంఘటనమె దీనికి కారణమని
సంకోచించక ప్లీడరిట్లనెను.

పండరిలో నూల్కరు జడ్జీ తన
వ్యాధినివారణ కొరకై శిరిడికి
పోయి సాయినే ప్రార్థించెద ఆ
సాయి యె నాకు బాగొనరించును
అని పలుకగ నేనును నా మిత్రులు
అలుసు తనముతో నిట్లని అంటిమి.

ఔరా! నీవొక విద్యావంతుడ
వై అవివేకిగ ఇట్లను చుంటివ

పోనెంచెను కాని సాయి
పొమ్మనె మరునటి రోజున

కాని అతడు వినకుండ ప్ర
యాణము సాగించిదారి
మధ్య టాంగ బోల్తాపడి
వైద్యశాల పాలయ్యెను.

ప్రభువాజ్ఞానుల్లంఘున
ఫలము ననుభవించక త
ప్పదు కద! ఎవ్వారికైన
ప్రభువాజ్ఞ శిరోధార్యము

సాయి మాట వినని వారు
సంకటముల పాలగుదురు
సాయిమాట విన్నవారు
సౌఖ్యంబుల బడయగలరు
॥శ్రీ శిరిడీ సాయి చరిత॥

## సర్వాంతర్యామి బాబ

బలరాం మంకడు గృహస్తు
బాబను సేవించు వాడు
అతని భక్తి కలరి బాబ
అతనిని మచ్ఛీంద్రగడున
కరిగి కొన్ని నాళ్ల జపము
నాచరించు కొని రమ్మనె

బాబా ఆజ్ఞాబద్ధుడు
బలరాం మచ్ఛీంద్రగడుకు
పోయి జపము చేయుచుండ
సాయినాథు డొక్కనాడు.

అతని కచట కనిపించెను
అంతట బలరాముడడిగె-

సాయీ! నన్నేల షిరిడి
సాన్నిధ్యము నుండి ఇటకు
పంపితిరని అంతసాయి
బదులాడుచు నిట్లనియెను.

నను శరీర ధారిగనే
కనుగొను చుంటివి కానీ
నను సర్వాంతర్యామిగ
కనుగొన లేకుంటి వనుచు

నీకీ అనుభవము గూర్చ
నిను పంపితి నిచ్చోటికి
అది ఇపుడెరిగితివా అని
అంతర్ధానమ్మాయెను.

అంతట మచ్ఛీంద్రము విడి
ఆ భక్తుడు బలరాముడు
షిరిడి జేర బయల్వెడలె
చిత్రమొకటి సంఘటిల్లె

రైలుటికటు కొనబోగా
రద్దీగా ఉండుటచే
టిక్కటు దొరకక బలరామ్
మిక్కిలి చింతించుచుండె.

పల్లెటూరి వేషములో
బాబా అతని దగ్గర

## ధుని

ద్వారక మాయిలో ని
త్యాగ్ని హోత్రమును బాబా
వెలిగించెను దానికి ధుని
పేరు ప్రసిద్ధంబాయెను.

ఆధుని నేటికిని గూడ
అహర్నిశలు రగులు చుండు
దానినుండి బూదిని గొని
ధరియింతురు భక్తజనులు.

బాబా ఆధుని నుండియె
పట్టెడు బూదినిగైకొని
రోగులకు నొసంగి వారి
రోగములను నయముసేయు

ఎట్టి రోగములకైనను
చిట్టెడు ధుని ఊదినిచ్చి
నరుల కర్మతొలగించుచు
నయము జేసి పంపుచుండు

## బాబా పాడిన ఊదిపాట

ఆవో కల్యాణరామ! ఆవో! ఆవో!
లావో ఊదికెథైలే లావో! లావో!
రారా కల్యాణరామ రారా! రారా!
తేరా ఉదీ గోనెల తేరా! తేరా!

## సాయి వాక్కు సౌఖ్యప్రదము

తనను జూడవచ్చు వారి
దయతోడను జూచువాడు
వారి పురాకృత కర్మల
పరిహరించి పంపువాడు

కొందరు భక్తుల బాబా
కొన్నినాళ్లు ఉండమనును
మరి కొందర వెను వెంటనె
తిరిగి పొండుడని చెప్పును.

తాత్యాకోటే పటేలు
త్వరితముగా కోపర్గామ్
సంతకు పోనెంచి అను
జ్ఞను గోరెను సాయి విభుని

అతని కొంత సేపాగిన
అనంతరము పొమ్మనియెను
సాయి మాట వినక అతడు
సావుల్ బావిని జేరిన

యంత టాంగ బోల్తాపడి
ఆసుపత్రి పాలాయెను.

ఐరోపా దేశీయుం
డగు దొర బాబా దర్శన
మునకు వచ్చి తొందరగా
తనకు దర్శనము నిమ్మని
కోరెను బాబా అతనిని
కొంతకాల మాగుమనెను

ఆ ధ్దొరవా రసంతుష్టు
డై షిరిడీ వెంటనె విడి

గౌరవాదరమున రొట్టె
కూరలిచ్చి పంపి కాని
తా భుజించి యెరుగదు ఆ
తల్లి యెంత ధన్యురాలో!

ఎన్నడేని బాబా తన
ఇంటికి రాకున్న యెడల
గంపలోన వంటకములు
నింపుక బాబాకోర్కై

అడవుల వెదకుచు బాబా
కడకుజేరి అవియన్నియు
తినిపించిన కాని ఆమె
తినదు కన్న తల్లివోలె.

సాయి విభుని బయజబాయి
సాక్షాత్ భగవంతునిగా
భావించెడిదామె పూర్వ
భవమందు యశోద యేమొ!.

ఆమె పుత్రుడగు తాత్యా
పై మక్కువ బాబకు, వా
డును బాబను మామా అని
చనువు తోడ బిలుచువాడు

తన ప్రాణములిచ్చియైన
తాత్యను రక్షించెదనని
బాబా ఆమె కొసంగిన
వాగ్దానము నిలుపు కొనెను.

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థమరయు
త్రోవను గనరారండీ!.

## అన్నదానం

ద్వారక మాయీ సన్నిధి
చేరవచ్చు భక్తులకును
ఊరిలో వసించు పేద
వారలకును భోజనముల

స్వయముగ తావంట చేసి
ప్రియమారగ బెట్టు చుండు
ఆ సాయికి అన్నదాన
మందున ఆసక్తిమెండు

వందలాది భక్తజనుల
కందరకును రుచికరమగు
రక రకాల వంటల తా
నొకడె వండి పెట్టుచుండు.

పక్వ పరీక్షలకు గంటె
పని యుండదు కుతకుతమని
ఉడికే వంటకములోన
కుడి చేతిని పెట్టి త్రిప్పు.

భగవాన్ బాబా స్వయముగ
వంటచేసి వడ్డించిన
నైవేద్యము భుజియించిన
వారెంతటి పుణ్యాత్ములో!.

అర్థించిన వారల కా
మ్యార్థములను దీర్చువాడు
ఆశ్రితులగు ఆ పన్నుల
ఆపదల హరించువాడు

శ్రీ సాయీ సన్నిధిలో
చేరి సదా సాయిని సే
వించు సాధు జనులను విను
తించుట దెంతో పుణ్యము!.

మాధవరావ్ దేశపాండె (శ్యామ్)
మహలస పతియును, బయిజా
బాయి, లక్ష్మిబాయి షిండె
సాయి సేవలో ముఖ్యులు

తాత్యాకోటే పాటిల్,
దాసగణూ, చందోర్కర్,
బాలాగణపతి షిండే,
బాపూసాహెబ్ బుట్టి,

హేమాడ్ పంతూ, రాధా
కృష్ణమాయి, బాగోజీ,
గణపతి, మంఖడ్, మేఘుడు,
కాకాసాహెబ్ దీక్షిత్

ఇత్యాది మహాభక్తులు
ఇహ పరార్థ సాధనకై
సాయిని సద్భక్తి గొలిచి
సద్యోగములను బడసిరి

భక్తిశ్రద్ధలను గలిగిన
పరమార్థము బడయవచ్చు
అనుచు సాయి పలికిన నట్టి
అమృత వాక్కులను వినుడీ!

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థమరయు
త్రోవను గనరారండీ!

## దక్షిణ

తన వద్దకు వచ్చువారి
దక్షిణ నిమ్మని అడుగును
అడుగక కొందరు దక్షిణ
నిడుచో తాగొన కుండును

భిక్షకొరకు సాచిన ఆ
దక్షిణ హస్తము నిత్యము
అభయ హస్తమై భక్తుల
నహరహమ్ము రక్షించును.

## బైజాబాయి

తాత్యాకోటే పాటిల్
తల్లిబైజబాయి ఆమె
బాబా భగవానుండని
భావించెడి భక్తురాలు

ప్రతి దినమాయమ ఇంటికి
బాబా చనుదెంచు వాడు
అక్కా రొట్టివవూ అని
మక్కువతో నడుగువాడు

హిందువుడై ముసల్మాను
చందము వేషము దాలుచు
నని ద్వేషించిరి హైందవ
వణిజులు సాయి మహాత్ముని

నూనెకు బదులుగ ప్రమిదల
లోన నీరు పోసినాడు
దివ్యశక్తితోడ నీటి
దివ్వెల వెలిగించినాడు.

భక్తి భక్ష్యపెట్టరు తమ
పాపాలను క్షాళించరు
మత్సరమను మధువు త్రాగి
మతం మత్తు తొలగించరు.

ప్రతి నిత్యము బాబా దీ
పాలను వెలిగించుచుండు
జ్యోతి కాంతులను గని సం
ప్రీతి జెంది మురియు చుండు.

అజ్ఞానాంధ్యము బాపుట
కైజ్ఞాన జ్యోతిని వెలి
గించి ధర్మ మార్గము జూ
పించినరుల బ్రోచుచుండు.

భిక్షనడుగ వచ్చిన ఆ
భిక్షకుండు మన పాపము
లను గైకొన వచ్చినాడు
అనుభావము నిజమైనది.

భిక్షాటన సేయువారు
భిక్షకులా! రక్షకులా?
భిక్షనొసగు వారి కర్మ
పీడల హరియించు వార?

బాహ్యాంధ్యము దీపముతో
పారద్రోలు చందంబున
అంతర తిమిరమును జ్ఞాన
కాంతితోడ పారద్రోల

గా వచ్చు నటంచు బాబ
జ్ఞాన బోధ గావించెను
పాపకర్మ తొలగ జ్ఞాన
దీపాలను వెలిగించెను.

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినండీ!
జీవన పరమార్థ మరయు
త్రోవను గనరారండీ!

## భక్తులు

పలు చోటుల నుండి అనే
కులు భక్తులు షిరిడి వచ్చి
బాబను సందర్శించుచు
పరితుష్టిని జెందువారు

తనను జూడవచ్చిన వా
ళ్లను ప్రేమగ జూచువాడు
వారి మనోభావంబుల
నారసి భాషించువాడు

భిక్షమిడుట త్యాగబుద్ధి
పెంపొందగ సేయును గద!
త్యాగశీలి సర్వభూత
తతిపై దయ జూపును గద!

భిక్షమడుగు వాళ్లందరు
పిచ్చోళ్లట్లని పింతురు
కాని వాళ్లలో కొందరు
జ్ఞానులుందురని తలపరు

సాయి పరాత్పరుడు దయా
సాగరుడై దుష్టుల పా
పాల తా గ్రహించి వారి
పరిశుద్ధుల గావించును.

బాబా భిక్షాటనమున
పరమార్థ రహస్య మిదే
భిక్షంబిడు వారి పాప
ప్రక్షాళన మార్గమిదే!

భిక్షాందేహీ యటంచు
భిక్షకుడగు సాయి శివుడు
భిక్షనిడిన వారికి సం
రక్షణ నిడు చుండునెపుడు!

అను నిత్యము బాబా భి
క్షాటనమ్ము గావించును
పతిత జనోద్ధరణమ్మది
బాబా విధియై యుండెను.

శిష్టుల రక్షించుటకై
దుష్టుల శిక్షించుటకై
అవతరింతు యుగ యుగాన
అని శ్రీ కృష్ణుడు చెప్పెను.

కలియుగమున దుష్టకర్మ
కులు హెచ్చిరి హద్దు మీరి
శిక్షించుట పూనుకొన్న
రక్షించగ మిగులు దెవరు?

శిక్షించుట కన్న నరుని
రక్షించుట మిన్న యనుచు
దీక్షబూని కేవల సం
రక్షకుడై నాడు సాయి

యజ్ఞంబులలోన అతిథి
యజ్ఞము శ్రేష్ఠంబైనది
అతిథియనగ స్వయం విష్ణు
వనెడి సూక్తి నిజమైనది. ॥శ్రీ శిరిడీ॥

## తైలభిక్ష

వర్తకులొకనాడు దుష్ట
వర్తనుల ప్రబోధము చే
తైల భిక్ష నొసగరైరి
తమ మెంతటి దుష్టగుణము.

మహమదీయుడై హిందువు
మాదిరి దీపాలను వెలి
గించుననుచు సాయిని ద్వే
షించిరి ముస్లిమ్ వణిజులు

పరమ శివుడు భిక్షమెత్తు
బ్రతుక లేక కాదుకదా!
భిక్షుకుడై సర్వలోక
రక్షకుడై నాడు కదా!

ఎడమ భుజమ్మున జోలిని
కుడిచేతను డొక్కుదాల్చి
భిక్షాటన సేయు సాయి
విభుడు శివుని దలపించును.

భిక్షారూపాన పాప
ప్రక్షాళన సేయువాడు
భిక్షకుడా కాడు సాయి
సాక్షాత్పర మాత్ముడహో!

తంబిరేలు డొక్కుజోలి
దాలిచి మధ్యాహ్నవేళ
భిక్షాటన చేసి తాను
తెచ్చినట్టి పదార్థాల

ఒక్కమట్టి కుండలోన
నుంచువాడు దానిని తా
కొంత భజించియు మిగిలిన
దంత జంతు పక్షులకిడు

ఆ మసీదులోని వారు
ఆ పదార్థముల గైకొని
పరమాత్మ ప్రసాదమనుచు
భక్తితోడ భుజియింతురు.

సటకా దండముతో జన
సంకటముల బాపువాడు
జోలిడొక్కు పాత్రల పా
పాల భిక్షగొనెడి వాడు

హరుడు హలా హలము మ్రింగి
అవనిని రక్షించినట్లు
పాప హలము పరిహరించి
పరి రక్షణ సేయువాడు

ఎందరెందరో భక్తులు
ఎన్నెన్నో శ్రేష్ఠమైన
పిండి వంటకాలు పండ్లు
ప్రేమ సమర్పించుకొనిన

భిక్షాటన మానడహో!
భిక్షంబిడు వారి పాప
ప్రక్షాళన చేసి వారి
రక్షించెడి దేవుడహో!

భక్తి భిక్షనడుగు వాడు
పాపాలను దూరువాడు
భూత దయా పరులకెల్ల
ముక్తి ప్రసాదించువాడు.

భిక్షంబను భక్తిని గొని
రక్షణయను ముక్తినిచ్చు
భిక్షకుడను సాయి శివుడు
భిక్షకుడా! రక్షకుడా!.

అది ద్వారకమాయి ఆశ్రి
తాళినాదుకొను హృదమము
శిష్టజనుల దుష్టజనుల
చేరదీయు కృపాలయము.

## ఎవరీ సాయి బాబా

ఊరులేదు పేరులేదు
ఉనికిలేదు ఎవరీతడు?
మతము లేదు కులములేదు
మహనీయుండె వరీతడు?.

తలకుగుడ్డ చుట్టినాడు
దానికొనలు భుజము మీద
వదలినాడు పొడుగు చొక్క
ఫకీరువలె తొడగినాడు.

మసీదులో నుండు నితడు
మహమదీయుడగునా?
మందిర విధులాచరించు
హైందవు డితడగునా? ॥ఊరు॥

వేషభాషలను జూడగ
ముసల్మాను డనిపించును
చెవులకుట్లు జూడగ హిం
దువునివోలె కనిపించును.

సటకా చెదాల్చి జనుల
సంకటములు బాపువాడు
దండము చేదాల్చి ధర్మ
దండము నెలకొల్పువాడు

దీపము వెలిగించి జ్ఞాన
దీపమనుచు నలరు నహో!
ఘంటా నాదమ్ము చేసి
కంటకములు ద్రోలునహో!.

శంఖారావమ్ము చేసి
షడ్వర్గము ద్రుంచునహో!
ధుని రగిల్చి బ్రతుకుబూది
అని తత్వము చెప్పునహో!.

అల్లా మాలికుడనుచూ
చల్లని చూపులు గురియుచు
శరణమన్న వారిని తత్
క్షణమే రక్షించునహో! ॥ఊరు॥

ఎవరీతడు ఎవరీతడు
ఏమతస్థు డేకులస్థు
డల్లా సబకా మాలిక్
అను మహాత్ముడెవరీతడు?

శ్రీ శిరిడీ సాయి చరిత
చెవులారగ వినరండీ!
జీవన పరమార్థమరయు
త్రోవను గనరారండీ!.

## భిక్షాటన

భిక్షా పాత్రలు గైకొని
భిక్షాటన సేయువాడు
భిక్షంబిడు వారి పాప
ప్రక్షాళన సేయువాడు

* అని మహల్సాపతి మ
హాత్ముడా బాలకుని
తన పూర్వకృత పుణ్య
మను జ్ఞాన నేత్రమున

ఆ బాలయెగి పర
మాత్మగా నెరిగె!
ఆనంద పారవ
శ్యమున మైమరచె!

బాలకుని గనినంత
పరవశత్వము జెంది
పరమాత్మ వచ్చెనని
పలికె సుస్వాగతము!

దయచేయి దయచేయి
దయచేయి సాయీ!
స్వాగతము స్వాగతము
స్వాగతము సాయీ!

సాయియన పరమాత్మ
శబ్దార్థమై యొప్పె
పర్యాటనము నందు
బాబ యని పిలువబడె!

సాయి బాబా యనెడి
సార్థకంబగు పేరు
లోక ప్రసిద్ధమై
రూఢియై విలసిల్లె!

* గతిమార్పు

## మసీదు - ద్వారకామాయి

శిరిడీనే సాయిబాబ
స్థిరవాసము చేసికొనెను
ఆ ఊరను పాడువడిన
దైన మసీదొకటుండెను

ఆ మసీదు నందున నే
ఆవాసము చేసికొనెను
ద్వారకమాయీ అనియెడి
పేరున దానిని బిలిచెను.

అది ద్వారకమాయి ఆశ్రి
తాళినాదుకొను హృదయము
శిష్టజనుల దుష్టజనుల
చేరదీయు కృపాలయము.

బిడ్డలు దుర్మార్గులైన
ప్రేమ విడని తల్లివోలె
దుష్టకర్ములైన ఆశ్రి
తులను ప్రేమనుద్ధరించు

అత్యధిక ప్రీతితోడ
ఆ మసీదు ప్రాంగణాన
నిత్యమల్లె బంతియు గ
న్నేరు మొదలుగా గల పూ
మొక్కలు పెంచుచు నుండెను
చక్కని మనసున్న వాడు.

అను నిత్యము రెండు కుండ
లను భుజములపై నిడుకొని
బావి నీరు చేది తెచ్చి
పాదులకుం బోయువాడు

అని బాబా బదులు పలుక
నతడచ్చటి కరిగి చూడ
అతని గుఱ్ఱమగుపించెను
అతడానందము జెందెను.

అతని పేరు చాందు భాయి
అతడొక ఊరికి పటేలు
బాలయోగి చెంత జేరి
పటేల్ ముచ్చటించదొడిగె ॥శ్రీ శిరిడి॥

## చిలుము ప్రీతి

చిలుము త్రాగుటకు బాబా
చిలుము గొట్టమును దీసెను
గొట్టమున పొగాకు నింపి
కూరి సిద్ధ మొనరించెను

కుంభినిపయి తన సటకా
గ్రుచ్చెనంత నీరు వచ్చె
అట్లె మళ్లిగొట్టినంత
అగ్ని బయటికెగసి వచ్చె

దానితోడ చిలుమును సి
ద్ధము చేసుక త్రాగదొడగె
ఇది అంతయు గని పటేలు
ఇతడొక ముని పుంగవుడని.

తలచి అతని పాదాలకు
తలవాలిచి ప్రణమిల్లెను
ఆ బాలుడు చిలుము ద్రాగు
మని అతనికి చిలుమొసగెను.

దాని మహాప్రసాదముగ
దలచి దాని గొని పటేలు
త్రాగెను ఆ పిదప బాల
యోగి తోడ తానిట్లనె
బాలయోగి నా విన్నప
మాలించగ వలయును మా
గృహమున కరుదెంచి మమ్ము
కృపతో పాలించవలయును.

అని వినయముతో బలుకగ
ముని వరుడంగీకరించి
అతనివెంట అతని గ్రామ
మగు ధూప్ ఖేడున కరిగెను.

కొన్నాళ్లకు బావమరిది
కుమారుని వివాహమునకు
మునిబాలుని వెంటను దో
డ్కొని పోయెను చాందుభాయి.

## శిరిడి

వధువు గ్రామమగు శిరిడికి
వారెల్లరు పయనించిరి
ఖండోబా ఆలయ ప్రాం
గణ మందున బండ్లు దిరిగి

## మహల్సాపతి (మహస్థపతి)

స్వాగతమును పలుకవచ్చు
వారలలో ఆ ఆలయ
అర్చకుడగు మహల్సపతి
ఆ బాలుని జాడగనే.

స్వాగతమ్ము! స్వాగతమ్ము!
సాయి నీకు స్వాగతమ్ము
స్వాగతమ్ము స్వాగతమ్ము!
సాయీ సుస్వాగతమ్ము!

అంత వారలద్దానిని
యధారీతి గప్పివేసి
తాపసితో మనకేమని
తమనెలవుల కరిగినారు.

అట బాలుడు కొంతకాల
మావాసంబుండి నాడు
అట్లున్నట్లుండి ఆత
డచట నుండి పోయెనెటకొ!

ఆ శిరిడి గ్రామము విడి
ఆ సేతు హిమాచల ప
ర్యంతము ఆ బాలుడు ప
ర్యటన సేయగా దొడిగెను

ఏక కాలమున బాలుడ
నేక నామ రూపాలను
ధరియించు చనేక మహా
త్మ్యముల జాపగా సాగెను

తాత్విక బోధలు చేయుచు
ధర్మమార్గముల దెలుపుచు
అద్భుత లీలలు జూపుచు
ఆర్త జనుల రక్షించును.

క్షేత్రంబుల దర్శించుచు
ధాత్రీమండల మంతట
పర్యటించుచును, ఒకచో
బాలుని వలె వేరొక చో

పకీరు వలె ఇంకొకచో
పరుమ ఋషీశ్వరుని వోలె

దర్శన మిచ్చుచు నిరుపే
దలతో శ్రీమంతులతో
కలిసి మెలిసి మెలగుచు ఆ
గత అనాగతాల్ దెలుపును.

అద్భుత మహిమల జూపుచు
ఆర్తుల రక్షించెడి ఆ
బాలుని గని ప్రజలందరు
బాబా యని పిలుచువారు.

సటకా చేదాల్చు జనుల
కటకా పోకార్చుననగ
దండము చేదాల్చు భువిని
ధర్మము స్థాపించుననగ.

## చాంద్‌భాయి పటేలు

సటకా చేకొని బాబా
అటవియందు నొక వృక్షము
క్రింద విశ్రమించు చుండ
ఖిన్న వదనుడొకడు వచ్చి.

తన గుఱ్ఱము విలువైనది
తప్పిపోయినది మాసము
లారు గడిచె వెదకి వెదకి
అలసిపోతి ఆశలుడిగె.

అని దుఃఖించుచు పలికిన
అతని మీద జాలిని గొని
అదిగో ఆ వాగుదరిని
హయమున్నది వెళ్లిచూడు.

ఇంతవరకు మాతాజీ
కృష్ణప్రియ చెప్పినట్టి
సాయిజన్మ వృత్తాంతము
గేయరూపమున చెప్పితి.

శ్రీశిరిడీ సాయి చరిత
జీవాత్మా వినుమా! నీ
సంకటములు బాపిసాయి
సంరక్షణ సేయు సుమా!

## శిరిడి - వేపచెట్టు

శిరిడీ యను కుగ్రామము
జేరవచ్చి ఒక బాలుడు
వేపక్రింద శిలపై ఉప
విష్టుండై తపసివోలె.

దివా రాత్రములు మహిమో
ద్దీపితుడై మౌనముద్ర
దాల్చియుండగా జనములు
తమకముతో ప్రశ్నించిరి.

ఊరెయ్యది పేరేమిటి
ఓ బాలక నీవెవ్వరు?
నీవు జూడ మునివలె గా
న్పింతువు బదులాడవేమి?

ఏమడిగిన ఎంతడిగిన
ఏమి చెప్పడీ బాలుడు
వాలకమును గన ఇతడొక
బాలయోగి యనిపించును.

ఈ ఊరను ఖండోబా
అను దేవుడు ఒక భక్తున
కావహించెనపుడు ప్రజలు
అడిగిరి బాలుని గురించి

పలుగు పార గొని మీరా
బాలుడున్న చోట త్రవ్వి
చూడు డంచు ఆ భక్తుడు
సూటిగ రూఢిగ పలికెను.

అంతట ఆ గ్రామస్థులు
అచ్చోటును త్రవ్విచూడ
గృహద్వార మొకటి గోచ
రించె దాని ననుసరించి

లోని కరిగి చూడనందు
ధాన్యాదుల కుపయుక్తం
బగు ఆసనములు జపమా
లాది కంబులును మరియును

నాల్గ ఖండ దీపంబులు
వెల్గుచు కన్పించె నంత
వారద్భుత పడి బాలుని
ప్రశ్నించిరి ఇది ఏమని.

నా గురువు స్థానంబిది
నా గురుదేవులు ఇందున
తపోనిష్ఠలో నుందురు
త్రవ్వి నారలెందుకు ఇది

వెనువెంటనె మూసివేయు
డని పలికెను మునిబాలుడు

అని వెంకుశ గురుదేవుడు
ఆదేశించుచు తనకిక
పృథ్విని విడువేళ సమీ
పించినదని పలుకుచుండ

గురుని గాయ పరచినట్టి
కూళ మరణమొందె, దుండ
గులు వాని కళేబరమును
గొని వెంకుశ గురునిజేరి.

ఓ మహాత్మ! తెలియక మే
మొనరించిన అపచారము
క్షమియింపుడు పశ్చాత్తా
పమున మిమ్ము ప్రార్థింతుము

వీనిని బ్రతికింపుడనుచు
దీనముగా వేడుకొనిరి
అపుడు వెంకుశా గురుడి
ట్లని పలికెను వారితోడ

ఓ నాయనలారా! నా
లోన యెట్టి శక్తిలేదు
ఈ బాలుని వేడుకొనుడు
ఇతడు వీని బ్రతికించును

## మృతుని బ్రతికించుట

అంతవారు బాలుని పా
దార విందములపై బడి
ప్రార్థింపగ అతడు గురుని
పాద ధూళి కరమున గొని

మృత కళేబరముపైన నొ
కింత జల్లగనె నిద్దుర
మేల్కొన్నటు వానికి ప్రా
ణాలు వచ్చి లేచినాడు ॥శ్రీశిరిడీ॥

పరమగురుండంతట ఆ
బాలుని ఆశీర్వదించి
శిష్యుల కెల్లరకు విధుల
చెప్పి పిదప తానిట్లనె.

దేహము విడనుంటిని నా
దేహమునొకచో సమాధి
చేయుడచట వెంకట పతి
శిలా ప్రతిమ లభియించును.

దానినచటనే ప్రతిష్ఠ
తగసేయుండని చెప్పుచు
తన దేహము విడి దివ్య
త్వము నొందెను గురుదేవుడు

అంత గురుని కళేబరము
నట సమాధి గావించిరి
అచటనే లభించెను వెం
కన్న శిలావిగ్రహంబు

అచటా విగ్రహ ప్రతిష్ఠ
ఆదరమున చేసినారు
వెంకుశా సమాధి చెంత
వెంకటపతి వెలిసినాడు ॥శ్రీశిరిడీ॥

అటనొక వృక్షము క్రిందకు
ఆ గురు శిష్యులు జేరిరి
శిష్యున్ని తొడపై తలనిడి
చెప్ప తొడగ గురుడేదో! ॥శ్రీశిరిడీ॥

## గొడ్డావు పాలిచ్చుట

అపుడా ప్రాంతమునందే
ఆవును దోడ్కొని పోయెడి
హుల్లా యను లంబాడీ
యొకడు గానుపించినాడు

గోవునిటకు తెమ్మని ఆ
గురుదేవుడు అడిగినాడు
పాలీయదు గొడ్డావని
బదులు పలికినాడు వాడు

నీ కెందుకదంత కాని
నీవా ఆవును ఇటతె
మ్మనెను గురుడు అంతవాడు
ఆవును దోడ్కొని వచ్చెను.

గురుడు లేచి దాని వెన్ను
చరచి పాలు పితుక సుధా
ధార వోలె క్షీరంబు ల
పారముగా గురియసాగె.

## జ్ఞానామృతము

బాలుని దోసిలి నిండుగ
పాలు పిండి గురుదేవుడు
ఇది జ్ఞానామృతము దీని
నింపారగ ద్రాగుమనెను.

జ్ఞాన సుధా ధారల మన
సారగ గ్రోలెను బాలుడు
అపర పరమ హంస వోలె
అలరారెను గురుదేవుడు

ఆవును నీవిక గొని పో
మ్మా! ఇకనుండిది నిత్యము
పాలిచ్చును నీభాగ్యము
పండు ననుచు గురుడు పలికె

విస్మయంబు జెంది గురుని
వినుతించుచు హుల్లా తన
గోవును దోడ్కొని వెళ్లెను
గురుడప్పుడు శిష్యునితో

వేదాంత రహస్యములను
వివరముగా బోధ చేసి
కట్టు గట్టు కొన్న పేలి
కను ఇటుకను బాలునకిడి

## ఇటుక

బాలయోగివర! వీటిని
భద్ర పరచుకొనుమా! ఈ
ఇటుక పగిలినపుడే నీ
వీ తనువును త్యజియింతువు

అట్టి సమయమాసన్నం
బాయెననుచు గుర్తించుము!
పశ్చిమ దిశబట్టి పొమ్మ
పరమ పురుష నీకు జయము!

అనాథ బాలుడె వారసు
డై పోవునటంచు నెంచి
బంధుమిత్రులెల్ల ఈర్ష్య
పడుచు మండిపడుచుండిరి

రాజకీయ కుతుంత్రాలు
రవరవలై చెలరేగెను
బాలునపహరించుటకై
పలు కుట్రలు మొలకెత్తెను.

ఈ బాలుడు మహమ్మదీయు
డితని హిందువుల గలుపగ
నున్నారని ముసల్మాను
లులికి పడుచు కలహించిరి.

ఇట్టి అపోహల తోడను
ఈర్ష్యా ద్వేషాలతోను
ఎట్లో గడిచెను, బాలకు
డెదిగి యువకుడగుచుండెను

॥శ్రీ శిరిడీ॥

## గురుశిష్యులు

ఒక దినమున వెంకుశ బా
లకుని వెంటగొని సమీప
వనమున చాతుర్మాస
వ్రతదీక్షకు బయల్వెడలె

అది అదనుగ గొని దుండగు
లా బాలుని కడతేర్చగ
నెంచినారు ద్వేషమ్మును
పెంచుకున్న దుర్మార్గులు

గురుశిష్యులు విశ్రమించు
తరుణములో దుండగుడొక
రాయిని గొని బాలకుని శి
రమును దాకునట్లు విసరె

అదిగని గోపాల్ రాయడు
ఆ రాయిని గాలిలోన
నే యాపెను కొంతవడికి
రాయిక్రింద పడిపోయెను

అంతట వేరొక దుష్టుడు
పంతమూని యిటుక రాయి
గొని విసరెను బాలుని శిర
మునకు తగులనది రాగా

తన తల నడ్డుగ నిడి శి
ష్యునికి తగులవచ్చు ఇటుక
దెబ్బను తాదిని శిష్యుని
దబ్బున రక్షించె గురుడు

వెనువెంటనె గాయానికి
తన వస్త్ర మొకింత చించి
కట్టు కట్టుకొనెను నెత్రు
గార కుండునట్లు గురుడు

గాయపరచినట్టి ఇటుక
రాయిని గొని శిష్యునితో
అచ్చోటును వీడి గురుడు
అరిగెను వేరొక చోటికి

నేరుగ గోపాలరావు
నెలవుకు చనుదెంచి నంత
బాలుని గని ఆ రాయుడు
పరమానందము జెందుచు

చేతులు ముందుకు చాచుచు
చేర బిలుచుకొని బాలుని
ప్రియ బాలక నీ కొర్కై
వేచి యుంటినని పలికెను.

అంత జిజియ తన పెనిమిటి
అన్నట్లే జరిగినదని
అచ్చెరు వొందుచు బాలుని
అతని కప్పగించెనపుడు.

అతడును ఆ బాలుని తన
అక్కున జేరుచుకొనియెను
ఆమెకు తన గృహమందే
ఆవాసము కల్పించెను.

గోపాల్‌రావ్ వెంకటేశు
గొలుచువాడు గాన నతని
వెంకుశా యటంచు ప్రజలు
బిలుచు చుంద్రు ప్రీతి తోడ.

## బాల్యం

వెంకుశా మహాత్ముండే
వంకలేని ధర్మాత్ముడు
బాలునిపై అనురాగ మ
పారముగా నున్నవాడు

అతడాత్మజ్ఞాని యగుట
ఆ బాలుని పరమాత్ముని
గా నెరిగిన వాడగుటను
క్షణమేనియు వాని విడడు

కంటికి రెప్పగ బాలుని
గాంచు చుండుటను జూచిన
మనుమడు ఖండే రాయడు
మత్సరమున కినుక జెందె

తన మనుమని మీద కన్న
పెను మమతను నవ నూతన
బాలుని ప్రేమించెడు గో
పాల్రావును గర్హించిరి

అతిస్నేహ మతిప్రేమ
హానికరము కదా! తైల
మధికమైన వత్తి మునిగి
ఆరిపోవు కదా దివ్వె!.

గోపాల్రావ్ బాలునితో
గూడియుండు నెల్లప్పుడు
ఆ బాలుడె బహిఃప్రాణ
మై పోయెను అతని కపుడు

బంధువర్గమున కిది ఇ
బ్బందికరముగా నుండెను
ఆ బాలుడె వారసుడగు
నను అనుమానము పొడిమెను

బాలుని బాధించు రోగ
బాధ తొలగి పోవలెనని
బాలుడు బాగైన అదియె
పదివేలని భావించిరి.

కన్న మమత కన్న పెంచు
కొన్న మమత మిన్న గదా!
శిలకన్నను శిల్పించిన
శిల్పమెంతొ ఘనముకదా!

ఆ ఫకీరు బాలుని గొని
ఆ మిథునము నోదార్చెను
బాలుడు వృద్ధికి రాగల
వాడని ధైర్యము చెప్పెను.

బాలుని తనతో మున్వత్
పల్లె కరుగుదెంచి నాడు
వాని పేర్మి జూచుకొనగ
భార్య కప్పగించినాడు

ఆ ఫకీరు ఇంటను అ
ల్లారు ముద్దుగా బెరుగుచు
ఐదేండ్ల ప్రాయము వా
డై పోయెను ఆ బాలుడు

బాలుని సాంగత్యములో
బ్రహ్మానందము జెందుచు
ఆ ఫకీరు డాబాలుని
ఆత్మజ్ఞానిగ నెరిగెను

గత స్మృతులు కలిగి తనకు
కాలము తీరిన సంగతి
నెరిగిన వాడై భార్యను
దరికి జేరబిలిచిట్లనె!

సఖీ! జిజియ! వినవే ఈ
ఫకీర్ తనువు చాలించును
మృత తనువు సమాధి చేసి
మత సమ్మతి క్రియలు సలిపి.

పిమ్మట ఈ బాలుని గొని
నెమ్మది శేల్వాడి గ్రామ
మునకు పొమ్ము అచ్చట బ్రా
హ్మణ భూపతి యొకడుండును.

అతని పేరు గోపాల్ రా
వతడు తపస్సంపన్నుడు
అతడే బాలుని కొరకై
ఆత్రుతతో వేచియుండు

అతడు వీని దరిజేర్చును
భృతియు నీకు కల్పించును
అని ఫకీరు సాధువు తన
అసువులు విడనాడినాడు

అంతట తన భర్త చెప్పి
నటు లంత్యక్రియలు సలిపి
బాలుని గొని శేలువాడి
పల్లెకరుగుదెంచె జిజియ.

గ్రహణి బాధతో బాలుడు
కటకట పడుచుండ జూచి
జలజల కన్నీరొలుకగ
తలిదండ్రులు విలపించిరి

అన్యం శరణం నాస్తి య
టంచు పరాత్పరుని శరణు
వేడుకొనుచు బాలుని కా
పాడుమనుచు ప్రార్థించిరి

అంతలోన వారి గృహ
ప్రాంగణ మందొక ఫకీరు
అల్లా సంకీర్తనమును
ఆలాపించుచు వచ్చెను

వాకిట ముంగిట నిలబడి
బాలుని బిక్షగ నిమ్మని
ఆఫకీరు వేడుచు తన
హస్తములను చాచినాడు.

అంతట బాలుడు ఫకీరు
చెంతజేర చేయిసాచి
అతని దగ్గరకు పోయెద
నని సైగలు చేసినాడు

ఆ వింతను గని నంతనె
అశ్రుజలము కన్నులలో
జలజల ప్రవహించ దంప
తులు ఇట్లని తలపోసిరి

తమ మొరనాలించి తమను
దైవమె కరుణించ నెంచి
బాలుని కాపాడుటకై
ఫకీర్ రూపమునవచ్చెనొ!

తమ బాలుని ఆ ఫకీరు
దగ్గర గొనిపోయినారు
బాలుడు నయమగుటె తమకు
పదివేలని తలచినారు

దగ్గరగా చేరుకొలది
తగ్గ తొడగినది రోగము
ఫకీర్ రూపమున బాలుని
బాగు చేసినది దైవము

రాగ రహిత బాలభిక్ష
యోగి సమర్పణ మాయెను
యోగి కరస్పర్శ చేత
రోగి నిరోగిగ మారెను

తమకడుపున పుట్టకున్న
తమపై జాలిని గొనిదై
వమె అనుగ్రహించి నట్టి
తమ బాలుని వీడలేక

గుండెలు జలజల ద్రవించి
గ్రుడ్లనిండ నిండి నిండి
అలలై కలలై మమతల
అశ్రువులై ప్రవహించెను

వట పత్రము లందు ప్రభా
ఛటలు జిమ్మ బాలుని గని
పరాత్పరుడె జాలినిగొని
ప్రసాదించె నీ బాలుని.

అని పరమానంద భరితు
లై లక్ష్మి హరికృష్ణలు
కడుపారగ కన్నవాళ్ల
కరణి పొంగిపోయినారు.

అచ్చటనే ఆదంపతు
లావాసము నేర్పరచిరి
ఆ వింతను విని జనములు
అందు వసింపగ వచ్చిరి.

పసిబాలుడు పత్రమ్ముల
పై దొరికిన స్థలము గాన
ఆ గ్రామము పత్రి గ్రామ
మని ప్రథితమ్మై పోయెను.

హేవళించి చైత్ర శుద్ధ
నవమి పునర్వసు కూడిన
గురువారము నాడు లక్ష్మి
హరి దంపతులకు గన్పడె.

అదియే శ్రీరామనవమి
ఆనాడే ఆ బాలుడు
భూమి జనుల నుద్ధరింప
పుట్టినట్టి పుణ్యదినము ॥శ్రీ శిరిడీ॥

# శైశవము

ఆ లక్ష్మి హరిదంపతు
లా బాలుని తమ ఆరవ
ప్రాణముగా నెంచి గార
వాన పెంచుకొను చుండిరి.

శుక్లపక్ష చంద్రుని వలె
శోభిల్లుచు దినదిన ప్ర
వర్ధ మానుడై బాలుడు
వర్ధిల్లుచు నలరారుచు

పసితనముల పరువములను
బాల్యక్రీడలను దేలుచు
తలిదండ్రుల మురుపు ముచ్చ
టల దీర్చుచు నెగడుచుండె.

మూడు వర్షముల వాడై
ముచ్చట గొల్పుచు నుండగ
అకస్మాత్తుగా గ్రహణి
వ్యాధి బాలునికి సోకెను.

ఎన్ని ఔషధములిచ్చిన
ఏ మాత్రము తగ్గదయ్యె
గ్రహణి రోగమది బాలుని
గ్రహమువోలె విడువదయ్యె.

కృష్ణపక్ష చంద్రుని వలె
కృశియించెడి బాలుని గని
తలిదండ్రులు దిగులు చెంది
తల్లడిల్లి పోసాగిరి.

వట పత్రము లందు ప్రభా
ఛటలు జిమ్మ బాలుని గని
పరాత్పరుడె జాలినిగొని
ప్రసాదించె నీ బాలుని.

అని పరమానంద భరితు
లై లక్ష్మీ హరికృష్ణులు
కడుపారగ కన్నవాళ్ల
కరణి పొంగిపోయినారు.

అచ్చటనే ఆదంపతు
లావాసము నేర్పరచిరి
ఆ వింతను విని జనములు
అందు వసింపగ వచ్చిరి.

పసిబాలుడు పత్రమ్ముల
పై దొరికిన స్థలము గాన
ఆ గ్రామము పత్రి గ్రామ
మని ప్రథితమ్మై పోయెను.

హేవళించి చైత్ర శుద్ధ
నవమి పునర్వసు కూడిన
గురువారము నాడు లక్ష్మి
హరి దంపతులకు గన్పడె.

అదియే శ్రీరామనవమి
ఆనాడే ఆ బాలుడు
భూమి జనుల నుద్ధరింప
పుట్టినట్టి పుణ్యదినము ॥శ్రీ శిరిడీ॥

## శైశవము

ఆ లక్ష్మీ హరిదంపతు
లా బాలుని తమ ఆరవ
ప్రాణముగా నెంచి గార
వాన పెంచుకొను చుండిరి.

శుక్లపక్ష చంద్రుని వలె
శోభిల్లుచు దినదిన ప్ర
వర్ధ మానుడై బాలుడు
వర్ధిల్లుచు నలరారుచు

పసితనముల పరువములను
బాల్యక్రీడలను దేలుచు
తలిదండ్రుల మురుపు ముచ్చ
టల దీర్చుచు నెగడుచుండె.

మూడు వర్షముల వాడై
ముచ్చట గొల్పుచు నుండగ
అకస్మాత్తుగా గ్రహణి
వ్యాధి బాలునికి సోకెను.

ఎన్ని ఔషధములిచ్చిన
ఏ మాత్రము తగ్గదయ్యె
గ్రహణి రోగమది బాలుని
గ్రహమువోలె విడువదయ్యె.

కృష్ణపక్ష చంద్రుని వలె
కృశియించెడి బాలుని గని
తలిదండ్రులు దిగులు చెంది
తల్లడిల్లి పోసాగిరి.

# గురువు ఆవశ్యకత

వేదాంతమునందు నరుడు
స్వేచ్ఛాపరుడని దాభో
ల్కరుడు-కాదు పరమార్థము
గురుని వలన కలుగుననుచు
బాలా సాహెబు సాఠే
వాడలోన వాదాడిరి.

మరుసటి దినమున దాభో
ళ్కరు డితరులతో గూడుక
బాబా సన్నిధి కేగెను
బాబా అపుడిట్లనియెను.

సాఠెవాడలోన నేమి
జరిగె ఆ వివాదమేమి?
అది దేనిని గూర్చి ఈ హే
మాద్రి పంతుడేమి పలికె?

ఆమాటలు విని ఆశ్చ
ర్యము జెందెను దాభోళ్కర్
సాఠెవాడలో జరిగిన
సంగతి తనకెట్లు తెలిసె.

తన పూర్వికుడును సచివా
గ్రణియగు హేమాద్రిపంతు
డతడెక్కడ తానెక్కడ
అని నిరహంకారుడయ్యె

దీక్షితుడను భక్తుడొకడు
దేవా నేవెళ్లన? అనె

అట్లే అని బాబా బదు
లాడెనంత ఎక్కడి కని
భక్తుడొకండడుగ చాల
పైకని బాబా పలికెను.

అపుడు మార్గమును గురించి
అడిగినంత బాబా ఇ
ట్లని పలికెను అటకేగుట
కనేక మార్గములు గలవు

శిరిడి నుండి గూడ నటకు
చేరుటకొక మార్గముంది
మార్గమది ప్రయాసకరము
మార్గమధ్య కాననమున
పెను బెబ్బులులును తోడే
ళ్లును గలవని పలికె బాబ.

దీక్షితు డపుడడిగె నిట్లు
దేవా! ఒకమార్గదర్శ
కుని వెంటను దోడ్కొని పో
యినచో అన అట్టులైన

కష్టమె యుండదు ఆతడు
గమ్య స్థానము జేర్చును.
దోవలోన మృగముల గో
తుల బెడదల తప్పించును

అతడే లేకున్న యెడల
అడవి మృగాల్ చంపవచ్చు
దారి దప్పి గోతులబడి
ఘోరస్థితి పొందవచ్చు.